సేవాసంఘప్రచురణములు—1.

# హాళీక్రి



గ్రంథకర్త

బాలదారి వీరనారాయణదేవు.

రాజమహేంద్రవరము.

1922.

డి. వి. రమణారావుగారిచే
శ్రీవిద్యావిలాస ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

# హాలికి



ఇది క్రీస్తుశకము. చిత్రవిచిత్రములతో బహురూపములతో భయంకరనాదములతో, భావప్రపన్నములతో వింతమార్పులతో వినోదసౌఖ్యములతో నవముఖముగ నడచుచున్న శతాబ్దము. ప్రస్తుతము మన్మథనామసంవత్సరము మాఘమాసము. ఉత్తరాయణము గడచుచున్నది. గాలిచే నూగులాడు నదీజలమట్లు లోకమల్లలాడుచున్నది. కవుల కలములలో, పాటగాని పిల్లరాగములలో భక్తులయూహాలలో సంస్కర్తల నందనములలో చరిత్రకారుల సవరింపులలో బసిపాపల పాటలలో బాధితుల గుండెలలో సూక్ష్మభావములు బొంగి పొరలుచున్నవి. లోకవృత్తము దాగుమూతై తలక్రిందులై తబ్బిబ్బులై యూగుదప్పుచుండివలె తెకతెక నుఱికిపోవుచున్నది. ప్రజలేదియో యద్భుతప్రదర్శనమునకు జాగువారివలె మతిచెడి గంగవెఱ్ఱులెత్తి

యుంగలార్చుచు వీధిబడినారు. కొందఱు యజ్ఞమని
కొందఱు యాగమని మఱికొందఱు సుందరనాటక
మని వేఱొకకొందఱు యుద్ధరంగమని పరిపరివిధముల
బలుకుచు నాయాపరికరములతో, గల్పనలతో నల్లి
బిల్లిగ నల్లి సన్నాయినొక్కులు డోలువాయింపులు
వగారామోహితలు, బిల్లనగ్రోవిపాటలు బాడుచు
న్నారు. చదువరులారా! మనముగూడ పదిమందితో
పాటు భుజము గలుపువారమగుటచేత నొక్కమారు
లోకమును ముందువెనుకల దొంగిచూచి మఱిపోవు
దము రండు. మనకెందఱల కీవృధాప్రయాస
మని యూరడింతురా; అట్లుకాదు. కష్టములో
సుఖము, భోగములో రోగము, ఇష్టములో నష్టము
ఉన్నట్లే దీనిలోగూడ నేదియోనుండకమానదు. పది
మందితో చావు పెండ్లితో సమానమనిగదా పెద్దల
సుద్దులు. పలుగురితో నారాయణా, కులముతో
గోవిందాన్నాడు. మనతొంగిచూపులకు, దోబూచు

ల క్కొట్లోతుపాతులానసోయెవ్వడెరుగు. ఒకనికి కాక
రకాయ బెల్లము, బీరకాయచేదు. తీపునష్టము. కార
మిష్టము. ఒకనికి తావలచిన ది రంభ తా మునిగినది
గంగ. శ్రీరామచంద్రుఁడు సీతమ్మకై సేతువను గట్టు
చుండ, నుడుత నాకేమని యూరకొన్నదా? యథా
శక్తి సహాగమనమట్లు పాటుపడి వీపుపై బంగారురంగు
గీతలు దెచ్చుకొని కులికియులుకుచున్నది. అనుందరా
కారుని మనోహరరూపమున జూచి మనసుకట్టలేక
తల దిమ్మెక్కి గెందనాలాడుచు కోరచూపులతో
బారచేతులతో, మిడిగ్రుడ్ల మిటకరింపులతో, మకన
వికారపు తెంటొంకాయింపులతో, డొల్లముక్కు
తొల్లల నిట్టూర్పులతో బొల్లికడుపు బోరలపాటుతో
ప్రాణేశా, యని పట్టపగ్గములులేని పసుచుగిత్తలాగు
ఎదపోయిన గొడ్డులాగు, మతిపోయిన మడ్డిమృగము
లాగు కుప్పిగంతులతో, కొండకేకలతో, కోఁపైబడి
శూర్పనఖ విరహబాధకు బడమానముగా ముక్కు

చెవులు ముద్దుముద్దుగా కోయించుకొని ముక్కోయని తనదారిని పోయినది.

వేయికన్నులసామి వెఱ్ఱివేసాలకు వెఱ్ఱినై పడియుండిన బాడబాగ్ని పాదములకు గుద్ది పతితనైనది. లోకలోకాలసుందరాంగులను బట్టి మరమ్మతు చేయు బండరక్కసిముండకొడుకు చేతివిసరుకు చట్టుబాడలయ్యేను. పరమసాధ్వి పట్టపగలు గుట్టుచెడి పట్టుకొనబోయిన కీచకాధముని కిచకిచలాడి కీచుకీచుమనినాను.

పసుపుకుంకుమల కోకలకుబట్టి యువ్వులగుప్పలాడి యాకాశమున కెగిరవేసిన చేతులతోనే కమ్మని పోపులుపెట్టిన వంటపాత్రలను గిరగిరత్రిప్పి కుదింపవలసివచ్చినది. బాణపరంపరలను సవ్యాపసవ్యములుగా కురిపించి మిన్నుమీదివెల్ల యేమరుచు మన్నుమీదికిరా, త్రెవ్వుజేసినవానిచేతులు, అనుపావలకు తుపులుమిట్ట కోకలుగట్టి, యలంకారములుబెట్టి "తక

కారుచు, నిక్కుచూ, నీల్గుచూ, గజ్జెంగుజ్జములాగు మువ్వలబంతిలాగు, పావురాగుబాళింపులతో, గువ్వకులుకులతో, కెకికేరింతలతో, నత్తరకరంపుపిలుపులతో, అగరువాసనచేసన్నలతో, కన్నీళ్ల జలకములతో, చిలుకతత్తడికౌతుబిగింపులతో, సాగింపగరాగా కాకు కాదని, అస్మత్పూర్ముని అబ్బబ్బే యని, ఆచారమని అల్లాయని యుంగలాచ్చి, కాళ్లమీఁదపడి. గడ్డముపట్టుకొని, వానిగాదని, వరుసగాదని, నీచిగాదని, జాతి చెప్పి కోతలుపడు భారతజాతి గొప్పచెప్పగలవాడెవడురా తండ్రీ! అదేమికర్మమో, మేహాపాతలు దేహమునకెంబాకిక శరీరముపుండై దోసపండువలె పగిలి నీరుగారుచు జాతిముక్కులైనా బిద్దలంబు పోవు వాసనతో రోతపుట్టు వానిని కాకులు గ్రద్దలు రాబందులు గూడ ముట్టుకోనివానిని పీనాపిశాచములుకూడ చూడగానే పిక్కబలము చూపువానిని నారాయణా చెప్పుకోరానివానిని, విషువక మహాదర

ముఖంలో మందహాసముతో మనసునిరుగని నడవడి
తో, మందగించని భక్తితో, మహాప్రసాదముని సే
వింపుచు ప్రాణేశ్వరా! ప్రాణప్రియా! జీవితేశ్వరా!
యనిపించుచు సేవలుసేయుచు, పాదములుకడిగి
కన్నులకద్దుకొనుచు నెత్తిబెట్టుకొను మత్తకాశినుల
కండమైనిలచిన నీమోసిదేశ మెవడు సృష్టించెనో
గదా! తెల్లవారితే చేతులోపడే సామ్రాజ్యము,
సర్వాధికారమును చెలాయింపగల యధికారమును
అనుభవింపలేక, అదృష్టములేక, మతిమాలి నతి
కా[illegible]నపడి పెళ్లిమేళ్లను, పదుముద్దులకు,
వయసుబిగింపులకు, కులుకుచేతులకు, సన్నాయి నొ
క్కులకు, చిక్కుపడి బానిసచేసిన ముసలిగాడిదను దవ
డూడ్చి యర్ధచంద్రప్రయోగములచే "గెటవుట్" చేయ
లేక, చచ్చుపెద్దమ్మయి, తండ్రిపనువై, తల్లిముసవని
కొనవెత్తిపలుకులు పలికి దేశాలువిడిచి, వనమపెళ్లా
ముపడేపాట్లయినా చూడక అరణ్యాలపాలయి, "పిశ్త

భక్తి — పితృభక్తి" అని పేర్లు వాడొకడు.

మాటపట్టింపులకేమి లేవోయి తాతాయనీ, ఏదో యొక విధముగా జేరము సంపాయించలేక రాగాలు భోగాలన్న మాటకట్టిపెట్టి కూటిబాధ, కుమ్మ బాధ, కొంపబాధ, ఇంటబాధ, లేక కచ్చుటిగించి ముక్కులిగిపట్టి చెట్టుకింద పైఠాయించు "ఒడేదాడి వాలాకు" నీకెందుకోయి, రాజ్యశాంతియుస మీదపడి జమాయించలేక మసిమసినగవులతో, పెద్ద ముచ్చటలతో, వాలుచూపులతో, వంకరనడకలతో, బింకపుబిగింపులతో కోకిలగానముతో కమ్మనిలుటు చేతి బొమ్మల వయసుకులుకులు చెలగించి చెంపలు కొట్టితే, మసుగులో గుద్దులాట గనయేమిటో చూతామనియైనా బుద్ధిలేక, ఒక్కమైలు పొడుగు ముద్దుమజా రుచి చూతామని కోరికైనా లేక, బెదరుచూపులు జూచుచు పెదవులుదడుపుకొనుచు, మోచేతిమలుపు మాటలైనా చేతగాక పండువంటి రాజ్యాన్ని, బంగారు

వంటిసంసారాన్ని, మాణిక్యము లాంటిమంచిని మంటగలి
పి కన్న సంతానమును కాకవాలుచేసి, ఉన్న భార్యను
ఊరుపాలు జేసి కాష్టాలదబ్బరు కాపుగాయుచు "సత్య
వాక్పరిపాలన — సత్యవాక్పరిపాలన" అని దండోరా
వేయవడొకడు. 'ఫూర్ బ్లైండ్ క్రీచర్ (గుడ్డివాడు)
కద యని దూరమాలోచించి పేరిమితో సహాయ్య
పడినదానికి ఫలితమాయని "జబర్దస్తీపై బందో
బస్తుచేయక" న్యాయము — ధర్మమని — నీతియని —
బాయాని, శ్రీరంగనీతులు, వంకాయికోతలు, డాబు
సరికోతలు, దర్జాకేషాలువేసి, సప్తసముద్రములు లిం
కించ జేయు, కులపర్వతములు గూలింప జేయు, అష్ట
దిగ్గజముల నదలింప సేయు, మహావీరులను, శూరు
లను, చేతలో బెట్టుకొని, గుండెలు కూలు శత్రుస్థాన
ముల — దండలుదరిగిన మగవారికను మొదట —
కొమ్ములువచ్చిన కోడెగాండ్రి కొంటెచూపుల కొనల
ముందు — నూనూగు మీసాలవారి నూత్నయౌవనము

కడ—ధర్మమూర్తులగు తాతలబిక్క—మొగములదగ్గర కోఱమీనపుకొంటివాడా కడు కొవ్వుబట్టి యీడ్చు కొనివచ్చిన కోమలాంగిని, కోకకొంగుకొనవ్రేల బట్టు కొని కంఠయోగ్య మొత్తోయుని, కూకలుబెట్టు ఆమ కూతురిని—మానభంగము, మానభంగమని యేడ్చు మానవతిని, పోతవిగ్రహంలాగు—బడితెకట్టలాగు—బుట్టబొమ్మలాగు ఊడగొట్టిన మంచంకోళ్ళలాగు చూచుచు నదరుబెదరు లేక, కన్నుగొలకుల నగ్నిమంటలు లేక, మోమున ముడుతలు లేక, కనుబొమల చిట్లింపులు లేక, కోరమీసపు మెలిమడతలు లేక, పెదవి నొక్కులు లేక, పాముబుసలు లేక శ్రీరామచంద్రా, శుద్ధసత్వ మూర్తివలె, జూచుచు "శాంతంభూషణమ్, శాంతం భూషణమ్" అని బోధించువాడా కడు.

పాపబుద్ధికో—పక్షపాతమునకో—పరమార్థ మునకో—పాడుసేయుటకో—పాలించుటకో, పాప ములుబట్టినవానిని, బ్రతిమాలినవానిని, ప్రణమిల్లిన

వానికి, పాపమనక, పరమార్థమనక, బాణావిద్యను బనికిరావని పారదోలగా, పుచ్చిగరగొట్టి బూడిదలో గలిపివేయుక, మట్టిబొమ్మపై మనసునిలిపి, మహానిష్ఠచే, మహాభక్తిచే, శక్తినాతుకై, కిరాతకిపకిసకొం చెంమమ్ము నగాపింపగా మనసు పట్టలేక, సిగ్గులేక తగను నమ్మాయుని చెంతజేరి గురుదక్షిణ కోరినప్పుడు, మురాల గదిముచ్చట్లు గురించి చూపించి, పీసెబూరులు, మరుగు బూరులు వియ్యపురాలసెలు, నేతియుప్పమ్ముతో గారవించి, చెక్కవేయుక, మాడ్చివేయుక, వెక్కివేదాంతాల వెంగళప్పాయి ఆత్మహత్యగావింపకొం "గురుభక్తి—గురుభక్తి" యను కూతలువెట్టునాడొకడు. మహారాజదర్జాతో, పట్టుమస్తులు బడాయుంది యుత్తరు గమగమలతో, బన్నిగుసిగనిగలతో, కస్తూరి చకచకలతో, జందనచర్చల ఘుమఘుమలతో, వారకాంతల వెనుక వాంగుకోపులతో, మద్దెల ముక్తాయింపులతో, బాకాలపసందులతో, నాసామి

రంగా, ఉగ్గిబరాటాంపలె భగ్గున వెలిగిపోక, సిరులనక మరులనక—కరులనక—పారులనక—అర్ధరాత్రమున హాయిగా హంసతూలికాతల్పము పైన, పరుండి దబ్బపండు వంటి— దానిమ్మగింజలవంటి— తామరాకులవంటి—తాంబేళ్ల వంటి—పంచదారంపవంటి—పాలమీగడవంటి, యావయవాలుగల చక్కని చుక్కను, గజ్జెగోడిగను, పద్దెమూర్తిని, సరాలకుప్పను, మాణిక్యాలమూటను, అబ్బా! రతీగాసిచేతి జంత్రపుబొమ్మను, నారామణిలకను, మహారాజుబిడ్డను విడిచిపెట్టి, చెట్లులూ, పుట్టలూ, కొండలూ, బండలూ, నూతులూ, గోతులూ, దిమ్మరిగాట్టు తిరిగి తిరిగి, తిండిలేక, తిప్పలులేక, నిద్రలేక, నీరులేక, చిక్కి శల్యమై, మాలకాకిలాగు, కాలుకాలిన పిల్లిలాగు, ఆసులోకకండెలాగు మాసమసి, గతమని, మాయయని, మంచియని, మతులువిరచి "అహింసాపరమోధర్మ—అహింసాపరమోధర్మః" అని తెగనీలు

గుగాడొకడు. ధర్మమనియొకడు—దానమనియొకడు.
పరోపకారమని యొకడు — పారమార్థమనియొ
కడు—త్యాగమనియొకడు—భోగమనియొకడు —
మతమనియొకడు—మహానిక్షేపమనియొకడు—భగవం
తుడనియొకడు—బ్రహ్మాండమనియొకడు— పీరిజాతి
బంగారుగాను, ఒకటేబాధలు—ఒకటేరాగములు—
ఒకటేదపువులు—ఒకటేచూపులు— ఒకటేకోపులు
ఏమిచూచినా, ఎక్కడజూచినా, ఎవని చూచినా
గుండెదడదడలుగద రాత్రిఁడీ! రాగాలుతీసి భగవం
తుని జూచువాడొకడు—భోగాలుమాని భగవంతుని
జూచువాడొకడు— భక్తి మాని చూచువాడొకడు—
కొండెక్కి చూచువాడొకడు— కోతిపక్కోరిగాంచువా
డొకడు—బెదరించి చూచువాడొకడు— బెల్లించి
చూచువాడొకడు—అబ్బబ్బా! కాంతలకౌగిళ్లలో,
పసికూనలముంగిళ్లలో, వేశ్యలఅంగళ్లలో, కవుల
కారుకూతలలో, మునులముక్కుకొనలలో, అమ్మ

లక్క లహాస్యములలో, దాదినమ్మదాటులలో, తందా
నతానగాడి దరువులలో, ప ష్టిమాను మూలుగులలో,
కోశిప్రేగులవాడి కూతలలో, మొదలుకత్తిరింపువాని
మోటుపాటలలో, కోనసెట్టివానికోలాటములలో,
నిదపునామములవారి మెడలలో, కష్టగలవారిదృష్టు
లలో, తెగనీలుగుగాడి తైతక్కలలో, నూటపదకొం
డ్ల సెప్టలలో, "మైనస్" వాడి మతములలో, గొల్లసు
ద్దులలో, గోవిందనామములలో, కొండవాగు గుట్టపై,
దొమ్మరిసాని దొంతరపై, దూదేకులమియాదుక్క
పై, బడేసాహేబు బండపై, బోడిదాని గుండుపై
మొండిదేవుడే గదా తాండవమాడుచుంటాడు. అద్దుగ
డుగు దండాలు-ఏకాసిమరణాలు-రాకాసిజాతరలు-అ
మాసతానాలు-పున్నాలపూజలు- గుడిమీదబొమ్మ
మెడలో నితాడు, ఒడిలో కసుపు, అంతావింతయేగ
దా. గండందాటి పిండంభూమిపడితే కర్మ కాలంతీరి
కైలాసమునకు కాళ్లుచాపితే కర్మకుట్టవాని బుట్టకు

మంగలివాని కత్తికి జుట్టిచ్చితే కర్మ, కర్మము చాలక గంగలో దిగితే కర్మ, కోడెగాని మెడలో తాడు వేసిన కర్మ. వయసు వచ్చిన మిఠారి, మదనుని కాసింత సేపు గడిలో కతారి గప్పచిప్పనకు కావలసినంత కర్మ. ఇంటిలో నిడుంటి ముండ జారిపోతే తలపు బిగింపులు-తల్లి ముందడుగా వేసి దాటిపోతే మీసమెగింపులు-తండ్రికి తలతగులు ఇంటిలోని యిల్లాలి గొంటుతనపు తంటాలకు గడ్డము పెరుకులు-చీకటి తప్పవరకు తప్పెట చప్పుడులు—విందు పిలుపులకు పసందు మేళములు—బిడ్డకు జూచుట కడ్డు తెరలు-గడప దాటుటకు కానిశకునములు--మహా దొడ్డజాతిరా, మహాదొడ్డజాతి. దేశదేశాల చరిత్రలలో దివ్యమైన, దీటైన, దిక్కైన తీరైన, తిన్ననైన దేశ చరిత్ర యిదియే గదా!

జాతులలో కమ్మని కస్తూరివంటి జాతి, నీతులకు నిధి, భావములకు బంగారుకొండ, మాటలకు మాణిక్యము, కవులకు కన్నతల్లి, భాషకు భాగ్యవల్లి, దేశ

మామాట దైవమెరుగు. జాతిమాట జగమెరుగు నీతి మాట నిష్పక్ష్యముకాదు కాని యిప్పటి కాలపునా గరికాల నాజూకు పసందు చూపగానే గుండె దడ దడలు, కాళ్లు గడగడలు, కడుపు గుడగుడలు, కోడి కూతకు ముందు లేచి యిల్లాక్కి జలకమాడి చాయ పసుపు పూసి నుదుట బొట్టిడి వక్రిమంతకి, కుంకుమ బొట్టుతో మహాలక్ష్మిలాగు. వంటచేసి వడ్డించి వల్లభుని పాదాలు పూజించి, యత్తమామలకు ఆడుబిడ్డలకు నూరులేని, గోడలేని మేలిముచ్చటలు దీర్చి, యతిథియభ్యాగతులను సంభావించి గృహరాజ్యమునకు రాణియై టింగురంగాయని తిరుగుచుండు మాత దాసికి, ముందుక త్తిరింపులతో పంచపాళీ కుప్పల గో పెయ్యనాకుడు పసందులతో కుచ్చులతో క పిడి ముట్టు బెంకములతో-బోడిముక్కులతో-బోసి మొగములతో-గూడచుట్టులతో- కాళ్ళజోళ్ళతో నల్లకోట్లతో-గాడిద గొంతుకులతో-కప్ప బెకబెకపెట్టు యిందువే

సికొని, దానబ్బ సొమ్ముదాచిపెట్టినట్టు, తాతగారిము త్లై తగులపిపోయినట్టు, వారమునక, వర్జ్యమునక, తేళ యనీ, పాళయనక తెగసాగుకు బేరమెందులకో! ముం తకొప్పులకు గంటి కాడలు, ముక్కెరలకు, ముక్కుద్ద ములు, చేతిగాజులకు జాతి గడియారములు బనా యించి మొగమునకు కొట్టుకొన్న కొత్తసున్నపు జా మపూతలతో, షికారెందులకో! చంకబిడ్డకు చంద మామను జూపి, చద్దిగుడిపి, జోలపాడి, జోకొట్టు, ని దురపుచ్చుదానికి, జోలి చంకను తగిలించి బజారు సౌసాయింపులు, మార్కెట్టు గేటులు—మార్నింగు వాకులు—మ్యారేజిబాంకులు ఎందులకు? వహ్వా! వహ్వా! తొంబదియేండ్ల తొక్కువకు తొలిసమర్త ముచ్చటలు—మూడేండ్ల ముద్దుకూనకు మూలము సుగులు. అరువదియేండ్ల యత్తగారి యడ్డాలలో పురి టికంపులు, ముప్పదేండ్ల ముద్దుకోడలి ముంజేతులకు ఎదుకులసాని వేరుముక్కలు, తాతగారి మీసాలకు

తళతళలాడు జీడిపూలతలు- పోరగానికోలబుఱ్ఱకు బా
లమునుపులు, తండ్రిది పూర్వాచారపు వెఱ్ఱి తంతు, త
ల్లిది నాజూకు నాగరికపు ధోరణి, తనది విదోమ్యా
రేణి గడబిడలు. కొడుకు ఇంగ్లండులో బడబడలు—
కోడలి 'ఎగ్మైండ్'లో గుడగుడలు—తన 'పూర్
మైండ్' లో దడదడలు. అత్తగారిది అద్దాలరవిక—
కూతురుది గుండీలపట్టు కోడలిది కుంఫినీ 'ఫేషన్'
జాలు జాకెట్టు. సెహబాస్! సెహబాస్! ఏమినాగ
రికము! ఏమి నాగరికము! ఏమినాజూకు రుసాదు! ఏ
మి 'సివిలైజేషన్' చాలు చాలురా బాబూ! క్రొత్త
బులపాటము చాలును. అప్పుడేమైనదా, యింకా
ముందున్నది మునుళ్ళపండుగ. సరేకాని యీమూల
చాలా గందరగోళముగానున్నది. చూపులాపిక్క
కు దృష్టి 'ఫోకస్' చేయాలి. ఆహా! 'సైట్ వెరీబ్యూ
టీ' 'సిల్కీగాండ్' 'అన్వేరల్డ్' మ్యాచిలెస్, ఔరా!
[illegible]గా! శక్తియంటె నీదే శక్తిరా! కత్తిలేదు—కఱ్ఱ

లేదు — మందు లేదు — గుండు లేదు, ఉత్తుక ఉక్కిరి బిక్కిరైపై, డొక్కపట్టి ఫల్టీలు కొట్టుచున్నదిరాదే శ్యము. కుడుములు తిన్నా గుజ్జువేల్పు బొజ్జవలె రాజ్యరమను కడుపుబ్బి భేరీమోత మ్రోగుచున్నది. లగిశా స్త్రియైనది. నూరుకాకులను తిన్నా, రాబందునకు ఒక్కగాలిపెట్టు. కపివంటి గుమ్మడి కత్తికిలా కువ. అబద్ధపు పెండ్లికి మద్దెవాయింపులున్నాడు, మాటలాడలేని మందభాగ్యుడు మహావక్తయై నడవనివడ డబ్బామోత మ్రోగుచున్నాడు. నరసాపురము దగ్గర నక్కడగ్గిస్తే తిరుపతికొండెక్కి తిరిగిచూచె తాత ఫిరంగి గుండుకు, పిరికిపు సరంజామాసిద్ధముచేయుచున్నాడు. అగ్గిపుల్లను జూచి యడలె తియ్యామనలు దవ్వుడాయించు, అడవి సన్యాసి అయ్యగారి యధికారానికి ఎదురుకోలు సన్నాహమంటూయున్నాడు ఓరి బాబోయి! గుమ్మము దాటి రానికూడిసముత, కుర్చీలకెక్కి కూర్చినివాడి దుంపతెంపుతామని లోడాక్రా

ట్టుచున్నది. బాపురుగాని కూతకు భర్తను కౌగిలించు కొను, అబల, భీరువ, అనద, ముగ్ధ, ముట్టరా డు వదలించుకొని, మోరవంచి, మోకాలు నేల దువ్వుచు, సవాళాయని పెద్దవీధియాబోతువలె రంకె లు వేయుచున్నది. పిల్లవాడు తల్లిమాట వినడు. తల్లి తండ్రికి లొంగడు. తండ్రిమనసు తామరాకులో నీటి వలె తల్లడిల్లుచున్నది. మ సుకుదురుపాటునకై మం చి పాత్రమేదైన వినవలెను. ఆదగోయిన తీర్థ మెమ రైనదే. అదిగో యావ్రక్కను కాలపురుషుడు కమ్మ ని కావ్యమును గంటమ్రోతలతో ప్రారంభించినా డు. కావ్యమనగానే కంగారుపుట్టి దేహము గజ్జకాక రకాయలాగు కంపమెత్తుచున్నదేమి చెపుమా. మన ను మంచిగంధపు పూతలకు, పుష్పాడి పానుపులకు చిగురు విసనక్రలకు, అగరువాసనలకు అరటిపట్ట లకు—తామరతూండ్లకు—కప్పూరపు కళికలకు, ఐ రుపులెత్తుచున్నదేమి? వేటయారంటములు, కోటగడలి

డలు, పేటముచ్చటలు, పిల్లచూపులు దొరకుననియా
ముక్కువర్ణన, చెక్కువర్ణన, కొంపవర్ణన, చెంపవర్ణన
దువు వహింప, ఒజలిబిరుసు, రుచిచూడవచ్చునని యా?
వదో మన కెందరకు మనదారి మనది. ఏవో రెండు ము
క్కలు విని నాటిపోనాము. ఓహో! కావ్యగర్భమునవ
రసములతో నిండి కొత్తావగాయ యూటవలె కారిపోవు
చున్నదే పాకము తేనెపాకమే. శయ్య గూబగుంయి
మనచున్నది. వృత్తి జీవితమునకు స్వస్తి చెప్పుచున్నది
రీతిపై కోతకోయుచున్నది. కావ్యమునందు శాంతర
వము ప్రధానము చేసినాడు టట్ పాడుచేసి పారవే
సినాడోయి, శృంగారములేనిదే బ్యూటీలేదే. లేకేమి
మచ్చిశృంగారములేదు. పట్టుపరుపులు విరిచి పందిరి
గుంజల కౌగ్బాకించలేదు. పాలుమీగడలు విడి
చిపన్నీరు చిలుకులకు—జోలేదు చందవెన్నెల
ను, బీరడయున్ని, యొడలు మండుచున్నదని
గుడి గుడిగుంజములాడించలేదు. మల్లిపూవ్వులను

ముళ్లకంపలవ లేదు. అర్ధరాత్రియాన శివమెత్తినట్లు దూలగొండ పసరు పూసుకొన్నట్లు తలకిరియబో యించి, అల్లల్లా అశ్వరభా' యని తందనాలాడించ లేదు. శృంగారమును సంసారపక్షముగ జేసి, దానికి శాంతరసముపూత మెరుగుపెట్టి, భవపరాఙ్ముఖులకు, పథ్యము పెట్టి తలమును కలుచేసివాడు కన్నుకట్టి ముక్కుబట్టి గంగమునుగు తలబోసులకు తప్పకన్నాడు. ఇక నునాయకుని మీద కన్ను వేదాము ఆయెదు, అసాధారణమేధాసంపన్నుడు—సుగుణ గణవిరాజితుడు బహుసుందరమూర్తి— సంపూర్ణత్యాగి—లోపలా వెలుపలా ఒక్కటే పరబ్రహ్మస్వరూపము లౌకిక క్రియాధురంధరుడు—అడుగున కిడుగు—ఎత్తుకెత్తు పేచీకి పేచీ—నుడతకు నుడత—లోడికి లోడి. చేయి కిచేయి కలుపుబడేవస్తాడు. నాయకరాలో, సస్యసంభరితమై, ఉదారచిత్తమై, ముప్పదిమూడుకోట్ల ముద్దుసూనులకు వీరమాతయై, రత్నగర్భమై, రామణీ

లు పట్టశక్యముకావు. అడబ్బసిగలరగ, ఆడువారిమీ
ద హడావడిచేసి, కొమ్ములు తిరిగిన ఉమ్మరావులుగొం
తలతో కూలి నేలపట్టైనారు. పూర్వము. చేపమై,
తాబేలై, పందై, నందియైన పరమాత్మ 'ట్రావి
లింగ్ బేగు' తో బయలుదేరి తిరుపతిక్షేత్రమునకు ము
హూర్తము పెట్టకమానడు. 'ఆపరేషను' ప్రారంభి
స్తాడు. ఇక్కడ నిలువగూడదు. పరలోకభాగమునకు
పోదాము. అబ్బోసి—అబ్బోసి—ఇది ముండదాని
వాత్తా. పలినాటిశని—ఎండలో వేసినమంచం నల్లు
లకంటె, పెనముమీద వేసిన రొట్టిముక్కకంటె—కుం
డలో నుడుకు నూనెకంటె—కుంపటిరువరులో కుత
కుతలాడు ద్రావకముకంటె నావాకష్టముగానున్నది.
బుట్టలో కుక్కిన చింతపండువలె పట్టలు ట్టుకొని యూ
పిపడకున్నారేమి? క్రిందపెట్టిబోర్లించి పైన దడ్డుకఱ్ఱ
తో బజాయింపగా నెండిపోయిన వంగపైరుగుబద్దల
లాగు రాలుచున్నారు. ఇది యమానుషకృత్యము.

పరిపాలనా సాధనమునను భరతవాక్యము విస్మరించెను. 'షేమ్ లెస్ హిపొక్రిట్' వర్ణించుట మన మనుచేత కాదు. త్వరగా నావలకు బోదము.

ఓహో! ఏమిచిత్రము! ఏమిచిత్రము! శ్రీమహా విష్ణువు పాంచజన్యమును పూరించుచున్నాడు. ఎక్కడచూచినను నుద్దేశమే. నాయకుని ముక్తకంఠము మనోహరమైన విష్ణుచక్రపుధ్వానితో లీనమై యెంత సొగసుగా, ఎంత ముద్దుగా, ఎంత ముచ్చటగా, ఎంత ఉల్లాసముగా, ఎంత చల్లగా నరములపట్టు సడలించుచున్నదో చూడు. కాలుమీద కాలు వేసి, నల్లనిబాబు పిల్లనగ్రోవి పట్టుపట్టినప్పుడు పసులు మేతలుమాని నిలిచిపోయినవని—పసిపిల్లలు పాలుత్రాగలేదని—గాలిదేవుడు కదలకుండా బిగిసిపోయినాడని—పనిచేసేగొల్లభామలు—పాలిచ్చుగొల్లభామలు—వయసుగొన్న గొల్లభామలు—పసిపిల్లలనువిడిచి, భర్తలనువిడిచి, భాగ్యాలువిడిచి, ఒకటేపరుగు, ఒకటే ఉరుకు, అనివర్ణిస్తే

కుమ్ములాడి యెట్లుకూలిపోవుచున్నారో చూడు. అది గోరోయ్, మనజ ఝంపోగుపతాలము సిద్ధ సుమతీ యని సిద్ధమయినది బట్టపిండినట్లు పేగులు పిసికేసి వేదాలు, శాస్త్రాలు—వల్లించి చలాయించుటకుఘట్టు మాటపట్టింపు వచ్చినదంటె నాసామిరంగా, రాజ్యాలు రాజ్యాలు తల్లక్రిందుచేసి— తారుమారుచేసి— తబ్బిబ్బుచేసి—దశాయించి 'హింగన్స్' కొట్టించుటకు 'బెస్ట్' మతంచెడి మాదిగవానికి మంగళహారతి పట్టినాడంటె మాలవానికన్న కనాకష్టముగా పీపాలు, పీపాలు టోకున అన్నులవారి యాపోసనపట్టుటకు తయ్యారు—అంతకు లేనినాడు మప్పిమంగాకు ముండయి ఉపనయనమున టిమాట యున్నదసుమతీ యని నుతివేయుటకు హాజరు—

లోకాలు లోకాలు డల్లడిల్లజేసిన నల్లనాసామి 'బాపనయ్యా నాదేనతయని' బాకాఊదినాడంటె బాధెందుకు. తెలివితేటలకు డివిటీయంటె ధుమధుమ

తెందుకు. బ్రహ్మముఖాన్ని పుట్టినాడంటె భగభగలు భుగభుగలు— రుసరుసలు—రుంయి రుంయిలు— ఎందుకు? తాతముఖాన్నేకాదు దానిసిందరగ ప్రతి దానిముఖాన్నా తన్ని పుట్టాడని ఢంకాకొట్టి—న గారావేసి—రండోలువాయించాలి—ఏదిపట్టినా పై స్థాయేగదా! సంఘుత్తే మమునకై, ముట్టరావని, చూడరాదని మాలబెట్టినమాలవానిని దేశభాగ్యమునకై చేరదీయంటంగో చేతులుగట్టుకొని సిద్ధమైనాడు. నీటి కాసుకుంట్టి జగజెట్టియై పట్టుపుట్టములు కట్టినవాడు ముందుగానేటు 'రిజర్వ్డ్' చేసికొనుటకు వర్ణసన్యాసియగుటకు సంశేహింపడు. కాలముతప్పినప్పుడు గడ్డంపట్టు కాదనిపించగలడు. కర్మాకే కన్నెత్తి చేసి కాళ్ళు కడిగించుకొనగలడు. కాదని కలహామునకు కాలుదువ్వితే అంగవస్త్రాలనకు ఝూంకి చెంబు అంటగట్టి—గిరగిరలు. తాటిమానునకు ఘుటాలరగిలించినాడంటె గుఱ్ఱపుకొడు—లేడిపరుగు. పట్టుపట్టి

తే మూడు శేర్ల ముద్ద మూడు చిటికలలో 'మెస్మరైజమ్'
జాతికి "స్టోరురూమ్" వాటివాడు. దేశానికి "రిజర్వ్ డ్ బ్యాంకు" జ్ఞానదీపకళిక. నాబంగారు బాపనయ్యని బ్రతికిబట్టకట్టనివ్వండి. ఊపడికుడుకులు తగ్గి కొంచెం స్థాయిపడితే అగ్రతాంబూలమునకు — సభాకట్టునునకు హాజరై, "ప్రజెంటుసార్" అనికలుకుతాను చూడండి. తక్కినజాతులు తొక్కులాడుతూ, గుడ్డమిటకరిస్తూ దవడలుతాటిస్తూ, చేతులు కాలినవెనుక ఆకులకు దేవుళ్లాడుతూ, వారివారి" "రేంకు" ల్లోతీరుగా "స్టేడ్, కాకపోతే చెవిసదపాఖ్యుంచుకొని పోతాను. ఇది సిద్ధాంతము—"గోల్డెన్ రూల్" తప్పుదు. తాతాచారిగారిముద్ర. సరే పైపెట్టుకుపోదాము ఇది లక్ష్మీకటాక్షము. కథానాయకుని పుట్టినిల్లు. కలియుగధర్మప్రమాణమైన "కీ" మానవజీవితము. నకు 'శిఖామొనార్' సంసారపాగుపునకు సాపవట్టిన రత్నం—అవతారపుట్టం. ఖతేబాగున్నది. పౌరుషమే

అగ్ని పరీక్షయని—ఆఖరు పరీక్ష యని, గడువులు పెట్టి, బెదరించి, బెల్లించి, పీడించి, నానవేసుకొని కూర్చున్నాడు. వాయిదాలు వేసి యొగగుంజి—దిగగుంజి, మేకు తాపడం చేసి, ముగ్గులో కి దింపి, జడ వేసి, కత్తిరించి, మార్కెట్టు రేటుపై పాటకొట్టి వేయుటకు సిద్ధముగానున్నాడు. పట్టు ధగధగలతో బంగారు నిగనిగలతో, సబ్బు తళతళలతో, ఇస్త్రీ రేకి పెళపెళలతో అత్తరు ఘుమఘుమలతో, సోకు బసాయించు జాతి "క్రీడమ్" బిడాయించి అసలు పరకు, సికాన్ని యునవి గలిపి దేశమును రక్షించినాము.

లోపలి గుట్టు పెరుమాళ్ళ కెరుకగాని, దీని భావము మొత్తము తేలాయని, పైకిపోనాము. ఆహాహా! అన్యాయము—"అయిన్ డేకలై, హెడ్ గిడ్డిమై, బైన వర్క్ స్టాప్,, అయ్యోసిక్యేషన్,, లోకడ్డాము. పోని గానీ, లాంకోటు నాసాములు, లాభసాటిలో పడి, లోభానముందు లాభము చూడకపోయినా, చంక

పుస్తకాల వెంకయ్యలకైనా, శంకరదోంటి పాత్రపోషణకు పాటుపడవద్దూ. కావ్యములో—కథాభాగములో—ముఖ్యమైన పాత్రేమి రసాభాసమైనదేమి ? ఈయపకీర్తి—కళంకము, కాటుకమచ్చ—గ్రహాణాం మొత్తీ, త్వరగా "రికవర్" చేసికొని, తరతరముల వారు వీరిపైనుమ్మెత్తిపోయకుండా, "క్రిటిసిజమ్" చేసి. దుంపతెంపకుండా, యికనైనా వైస్‌స్టెప్ 'తీసికోకపోతే, మహాపుణ్యకాలములో, కుక్కముట్టినకుండైపోతారు కక్కినకూడైపోతారు. "వేస్టులేండు" క్రిందఃమోజయిపోతారు. "స్కేర్‌క్రో" క్రిందపాతుకుపోతారు. వారిమీదనేయూధారపడి "మీన్సు" కై 'నాన్సెన్సు' పాఠాలుచెప్పే, పంతులయ్యలుకూడా "వైల్డుబ్రూట్సు" క్రిందనేజమ. పంతులమ్మలో మనంచెప్పలేము.

సరేకానీ మరొక్క "స్టెప్పు" "ఫ్యూర్‌నేషన్" దీని హృదయము, గోధుమపిండివంటిది. లక్కవంటిది మైనంవంటిది. మైదాపిండివంటిది. ఈపట్టుతప్పినా,

భద్రము. నేనుపోతాను. మరియొకసారికలిసికొందాము. సెలవు.—సలాము—నమస్కారము—రాంరాం-అంతాహుళ్ళకేగా, కథకంచికివెళ్లింది—మనంయింటికి వచ్చాము.



శ్రీవిద్యానిలయ ముద్రాక్షరశాల:—రాజమండ్రి, 1922